

శ్రీరస్తు.

# కవిరాజసందర్శనము

సీ. ఏలినరాజులోద్దా శుచి-వేంద్రుఁడునాదగుతాత, నాదియా।
జ్వాలకులంబు, నాకుగుణ-వృద్ధుఁడు వేంకనతండ్రి, రామభూ।
పాలుఁడు పాలకుండు, రస-వత్సుకవిత్వము జీవితంబు, గ।
ద్వాలనివాసభూమి, బుధ-వంద్యుఁడ, నేను "ప్రభాకరా" ఖ్యుఁడ
తే. తెనుఁగుదేశంబుఁజూడఁగా-మనసుగల్గి।
మూఁడునెలలుగనీచుట్టు-ముట్టుఁగాక।
నాడమొదలగుపేర్వడ్డ-నగరములను।
వలచిద్రిమ్మరుచేనిటీ-వలనేనొక్క॥
సీ. ఒకనాడువిజయవా-టికసోషియల్క్లబ్బు,
నందున్నసమయానఁ-గొండఅబ్బికు।
వచ్చిగద్వాలవి-ద్వాంసుఁడిచ్చటనున్న,
వాఁడాయటంచు-విశ్వాసమొప్ప।
నన్నడుగుటయునో-యన్న నేనేరండు,
కూర్చుండుఁడనిముందు-కుశలవార్త।
లడిగియాపిమ్మట-యయ్యమీవచ్చిన
కార్యమేమనుచునే-కవివతంస।
తే. మిమ్ముఁజూచుటకంటెగా-ర్యమ్ము వేఱు।
క్షాల దెమాబోంట్లకనుచున-గ్గలప్రేమ।
రాజుకెరివెట్టుపజలమ-ర్యాదతోప।
మంజువాణిప్రతినొకండు-మాకునిడిరి॥

ఉ. దానిమనోహరాకృతియు-దానిస్ఫుటాక్షరవైభవమ్ముసుఁ।
దానికళాకలాపముసు-దానివచోరచనాప్రభావముఁ।
దానిమనోజ్ఞహృత్పుటము-దానిగుణమ్ముసుఁజూచియారయిఁ।
ద్దానికినాథుఁడెవ్వఁడొక-దాయనియారసిచూచుచున్నెడఁ॥

క. ఒకరాజనిలసెనుదా । నికినచ్చెరువందియవని-నేటికిరాజుల్।
సుకవిత్వమెఱుఁగుసంతర । సికత్వముఁగూడగడన-సేయుటకలదే॥

సీ. కవివరులన్నచోఁ-జెవులుదిమ్ములుపొ్రాయు,
నాసానులేదాని-కౌషధములు।
గాయకులన్నచోఁ-గన్నులుపొరలద్దు,
నాబ్రాంచులేదాని-కౌషధములు।
శాస్త్రిజ్ఞులన్నచో-జ్వరమప్పుడేవచ్చు,
నాజూదములెదాని-కౌషధములు।.
హరిదాసులన్నచో-నంగమెల్లనుబుచ్చు,
వ్యాజ్యెమ్ములేదాని-కౌషధములు।

తే॥ ఇప్పగిదిఁబాడుకలియుగ-మెప్పుచుండ।
నేమివిపరీతమిదికబ్బ-మేడయేడ।
నరుఁడదియెగాకయొకనర-నాథమౌళి।
మంజువాణికినాథుఁడౌ-మాటయటిది॥

ఆరసిచూడఁగావలయు-నంచుక్షణమ్ముపరైలుమీఁదనే।
లూరికివచ్చిప్రాగ్గతము-హైన్నతసౌధముఁజొచ్చియాజమీం।
దారునుదారుసూనుపర-దారకుమారువిచారశేముషీ।
దూరుభుజంగరాజబహ-దూరునిఁగాంచిసమంచితోక్తులఁ॥

ఈక్రిందిపద్యమప్పుడు । సక్రమముగవ్రాసియివ్వఁ-జదివికొనినను
శక్రుఁడుబృహస్పతివలెన । వక్రగతింగౌరవించి-స్వాగతమనుచుఁ

సీ. హూణభాషాభ్యాస-మొనరించియాంగ్లేయ,
దొరలతో నెకయెత్తు-తూగినాఁడ।
నవర్ణసాస్పదముగాఁ-గవనమల్లుటనేర్చి,
యవనీశసభలఁబే-రందినాఁడ।
కన్నడంబొకకొంత-గఱచితత్సాంప్రదా,
యముఁగూడఁగొల్లగా-నరసినాఁడ।
సంస్కృతంబందును-సాధారణప్రజ్ఞ,
గలిగితత్సంగతి-వెలసినాఁడ।
తే. ప్రబలగద్వాలరామభూ-పాలభూమి।
పాలపాలితకవితాల-తాలవాల।
సాహితీహితసురసపో-షకుఁడనేను।
"ఆదిపూడిప్రభాకరా-ఖ్యకవివరుఁడ"॥ 9
ఉ. ఆదరమొప్పనన్నుఁదన-యందఁపుమేడకుఁజేర్చిచూపెవి।
ద్యాదయితుండతండునిజ-ధామపురాంగణవాటికాలస।
ద్వేదపురాణకావ్యముఖ-విశ్వసనీయసమస్తగ్రంథభా।
గ్యోదయహేతుకంబగుని-జోజ్జ్వలపుస్తకశాలఁజూపినన్॥ 10
శ్రుతులుపురాణముల్-స్మృతులుశాస్త్రింబులు,
కావ్యంబులునునాట-కములుబాణ।
ములుప్రబంధములుచెం-పువులునిఘంటువుల్,
శతకముల్ద్విపదలు-చాటువులును।
వచనముల్యక్షగా-నచయమురగడలు,
దండకమ్ములుసామి-తలునుమఱియు।
వేనవేలగ్రంథముల్-వెదకితెప్పించిభాం,
డాగారమూరనం-దఱికినుపచ।

ఇదియేవిజిటింగుకార్డుపైనివ్రాసిపంపెనపద్యము.

తే. రించునట్లుగ స్థాపించి-మంచికీర్తి।
నెగడుమతి నెవ్వరికిఁగల్గె-జగమునందు।
శ్రీమదానందగజపతి-క్షితిపతికిని।
ఘనుఁడగుభుజంగసార్వభౌ-ముఁడకుఁదక్క॥

సీ. నాల్గుమోములతోడ-నలువచందమ్మున,
నంతర్గృహంబుచె-ల్వారుచుండ।
తచ్ఛుకగతశార-దాసుందరదరీతి,
బుస్తకమ్ములబీరు-వులు వెలుంగఁ।
గొలువవచ్చినఋషి-కులచంద్రములనుబోలె,
సమధికోన్నతమహా-సనములమర।
వారు తెచ్చినపుష్ప-ఫలబృందములతీరు,
విడికాకితమ్ములో-క్కెడ జెలంగ।

తే. సకలసజ్జనసంతోష-సంప్రదాన।
సంతతసమర్ధశాశ్వతై-శ్వర్యమగుచు।
సత్యలోకము తేవభు-జంగరాజ।
పుస్తకాగారమొప్పుఁ బ్రశస్తఘణితి॥

సీ. తన్ను సేవించుబీ-దకునియ్యదేపాక,
భంజను దెగడుస-త్పదవినేనిఁ।
దన్ను భావించువి-ద్వనకీయదే,
శిబిమీఁదుకీర్తివి-శేషమేనిఁ।
దన్నుఁగాంక్షించుసా-ర్ధకునకునియ్యదే,
కంజాక్షుమించుసౌ-ఖ్యంబునేనిఁ।
దన్నుఁబ్రార్థించువి-ద్యానిధికియ్యదే,
సర్వేశ్వరునిమించు-శక్తియేని।

తే. సహహ యేమీయనోపఁడే-యమలనస్తు।

విప్సితములకు దేవతా-వృక్షమౌర!!
సకలసకలాకలాపభు-జంగరాజ।
పుస్తకాగారమహిమచె-ప్పుటకుఁదలమె॥ 13
అనికొండాడితినాడిటన్ గనిభుజం-గాధీశుఁడానందసం।
జనితోల్లాసవిభాసురుండగుచు బ్రాంచన్మంజువాణీకస।
ద్ఘనముద్రాక్షరశాలకే త్తెరననుం-దాబిల్చిగొంపోయిచూ
పిహపాషాణ్రశువులొల్కనచ్చటిపనుల్- వీక్షించి నేనయ్యెడన్॥ 14
దానియతిశయమును-దానముద్రణమంచు।
పత్రికాగుణములు-బడితదీయ।
నాథమధురభాష-ణములునుసాధర్మ్య।
భావమందునట్లు-పలుకవలసె॥ 15
అక్షరనామంబు-సార్థకముగఁజేయ,
మంజువాణికినిస-మానమున్నె।
జీర్ణకావ్యమ్ములు-జీవింపఁగాఁజేయ,
మంజువాణికిని-సమానమున్నె।
బుధజనమ్ములకు నా-మోదంబుగల్పింప,
మంజువాణికినిస-మానమున్నె।
బీదలకర్థంబు-వెట్టిపోషించుటకైన,
మంజువాణికినిస-మానమున్నె।
మంజువాణిధనమ్మిచ్చు-మానవులకు।
మంజువాణిసుఖమ్మిచ్చు-మానవులకు।
మంజువాణియశమ్మిచ్చు- మానవులకు।
మంజువాణికివేఱుస-మానమున్నె॥ 16
ఇమ్మెయిఁబల్కినసంతోషమ్మునగానామృతాఖ్య-సంగీతపుగ్రం।
థమ్మొకటిని యోగిప్రభు।గొమ్మని యిచ్చుటయుగొంటి-గొనియిట్లంటిన్

మ॥ సరసార్థోచితదివ్యప్రౌఢతరవా-చామాధురీధుర్యమై।
స్వరసాహిత్యములన్ దరాగములశుం-భల్లీలనుప్పొంగుఛా।
సురసంగీతపయోబ్ధిలోతుగొనియ-క్షుల్ మెచ్చగాద్రచ్చియు।
త్సురగానామృతమిచ్చెభూమికిభుజా-గత్మాధిపుండెంతయున్॥

మ॥ అనవినిహాసభాసురము-ఖాంబుజమల్లననూచియూచియి।
ట్లనుకవిసార్వభౌమకొని-యాడగనెంతటివాడనేనుని।
న్ననవరసంబులిట్టులుగ-నుగొననీమృదువాగ్వితానధో।
రణినసమానమయ్యెయిది-ప్రాకృతపుణ్యవిశేషమెంతయున్

క. అనియుగ్గడించిపలికిన। వినియూరకయుంటకవుల-విధమదికామిన్
జననాయకునామంత్రిణ। మొనరిచియిట్లంటిఁదద్గు-ణోచితభక్తిన్

సీ. తనధర్మమీక్షించి-తన్నుఁబొందినసిరి,
శక్తియేతనకుభూ-షణములుంచుఁ।
దనభూతదయఁగాంచి-తన్నువెన్నంటిన,
కమలతనకుఁదిల-కంబుదిద్దుఁ।
దనయోగితిలకించి-తన్నుఁజేరినకీర్తి,
తరుణియేతనకుగం-ధమ్ముపూయుఁ।
దననమ్రతనుజూచి-తన్నాశ్రయించిన,
భారతితనకుఁబు-ష్పములువెట్టుఁ।

తే. దనగుణములట్లుతన్ను ము-స్తాబుసేయ।
రాచతనముసుధనమును-రమ్యయశము।
విద్యయునుస్వీయగుణముల-ఁబెంపుసేసె।
మంత్రిసిరిగడభుజంగరా-ణ్మఘువుఁడెలమి॥

క. ఈరీతిస్వభావోక్తిని। నారచితంబయినవర్ణ-నమువినిరసవి।
స్తారుండతఁడొకవివర। తీరనుమాతనివిదీనఁ-దీరదఁటన్నన్॥

సీ. శృంగారరసమువ-ర్ణించినగాంగేయుఁ,

డంబవెంబడినంగ-లార్చవలయు।
కరుణారసంబెత్తి-కఱుఁగఁబోసినద్రాణి,
పూనిద్రుష్టమ్యమ్ము-బ్రోవవలయు।
వీరరసంబోలి-సారింపవైరాటి,
యొక్కఁడేకరుసేనఁ-జెక్కవలయు।
రౌద్రరసంబువ-ర్ణనసేయబలరాముఁ,
డానేనలోసివా-లాడవలయు।
నప్పుయిటుఁజెప్పనేర్చుప్ర-భాకరాఖ్య।
కవివరుఁడఁటన్న హేళన-కాదునుండు।
కాలమొకరీతినున్నది-కాకయున్నఁ।
దిక్కునకుఁదిక్కువిడిపించు- తెలివికలఁడు॥ 23
ద్రాక్షాఫలంపుని-ద్దంపుఁజక్కెరలఁది
న్పింతుఁగా బుగ్గల-నిం[illegible]
శృంగారవాసనల్-జిలుకంగజలకమా,
డింతుఁగాఁబన్నీట-డించిడించి।
మెత్తనిపొత్తుద-ళ్ళొత్తఁబూసెజ్జనే,
మింతుఁగాఁజోజోల-మించిమించి।
తేటమాటలముద్దు-పాటలఁబాడనే,
ర్పింతుఁగానక్కునఁ-బెంచిపెంచి।
యిట్టిమత్కవితాకీర-మెట్టకేల।
కెట్టిశుద్ధాంతసీమఁదా-మెట్టకలదొ।
యెఱిఁగవిధివిలిఖితమెట్టు-లెఱుఁగవచ్చుఁ।
బ్రతుకుఁగాంచుతలుబ్ధుని-బారిపడక॥ 24
ఏవంవిధమామకప్రా। స్తావికపద్యములుకొన్ని-జనువుటయునుమ।
త్ప్రావీణ్యమునెంతయు స।భావించిభుజంగరాజ-మణిస్వోమోక్తి॥25

(భుజంగరాయకృతము.)

సీ. భవదీయసరసప-ద్యవిచిత్రములుగని,
శారదానిలయంబు-సంతసించె।
యుష్మద్రచితకల్ప-నోన్నతుల్ గనుగొని,
బాగుబాగనిమంజు-వాణిపలికె।
ఆవకీనసుకవి-తామాధురినిగని,
సరసాళివిబుధాళి-సన్నుతించె।
త్వత్కృతోత్తమనూత్న-వర్ణనాంశములన్న
మాదృశులకది-విస్మయమొసంగె।
గీ. ఆదిపూడిప్రభాకరా-ర్య ! కవివర్య !
రవియెఱుంగనిచోటు-సత్కవియెఱుంగు।
రవివికవివీవయగుట-సర్వజ్ఞుఁడవయి।
జగతి వెలుగొందితివి-నెరజాణవగుచు॥

ఇట్లు విన్నవించువిధేయుఁడు,
రాజామంత్రిప్రగడభుజంగరావు

చ. అనికొనియాడిపించులిడి-యంచితభూషణవస్త్రగంధలే।
పనములతోడఁగప్పురపుఁ-బల్కులవీడెములందియిచ్చి మెచ్చి।
క్కనవరపుత్రివాస్ భవను-శ్రీభవదిగ్విజయోస్తు తేపరిభో
యనుచుభుజంగరాజరసి-కాగ్రణివీడ్కొనియూరుఁజేరితిన్।

ఆదిపూడి, పభాకరకవి.



సంపూర్ణము.